THE ANDHRA PATRIKA (WEEKLY EDITION) MADRAS.

10 పేజీలు వెల 2 అణాలు. హోలీ 0-2-4.

నూత్న ఆంధ్రరాష్ట్రం సంపద్విలసితం కావాలని గవర్నరు శ్రీ ప్రకాశ ఆకాంక్ష
—2 వ పేజీ

# ఆంధ్రపత్రిక

రాయచోటి తాలూకాలో దుర్భర క్షామ పరిస్థితి: కలెక్టరుకు విజ్ఞప్తి
—4 వ పేజీ

Regd. No. M. 5745 సంపుటం 39. సంచిక 333 FOUNDER : DESODHARAKA K. NAGESWARA RAO. ఆదివారము 8-3-1953

# స్టాలిన్‌స్థానే రష్యా ప్రధానిగా మాలెంకోవ్ అధ్వర్యం

## సోవియెట్ అధ్యక్షుడుగా వోరోషిలోవ్ నియామకం: ష్వెర్నిక్ పదవీచ్యుతి

## మాలటోవ్, బెరియా, కగనోవిచ్, బల్గానిన్ ఉపప్రధానులు: మాస్కోరేడియో ప్రకటన

లండన్, మార్చి 6: మార్షల్ స్టాలిన్ మరణించిన 24 గంటలకు ఆయన స్థానే రష్యాప్రధానమంత్రిగా జార్జి మాలెంకోవ్ నియమించబడినట్లు మాస్కోరేడియో ప్రకటించింది.

మాలెంకోవ్ వయస్సు 51 సంవత్సరాలు. స్టాలిన్‌కు ఎంతో ప్రీతిపాత్రుడైన ఈ మాలెంకోవ్ స్టాలిన్ తదనంతరం ఆయనకు వారసుడు కానున్నాడని పాశ్చాత్యదేశాల రాజకీయ వేత్తలంతా చిరకాలంగా అనుకుంటూ వున్నదే.

విప్లవకాలం నాటినుంచి స్టాలిన్‌కు సన్నిహిత సహచరుడున్నూ, రష్యన్ సైన్యనిర్మాత అయిన మార్షల్ క్లెమెంటీ వోరోషిలోవ్ (72 ఏండ్లు), నికొలాయ్ ష్వెర్నిక్‌స్థానే సోవియట్ యూనియన్‌కు అధ్యక్షుడు అయినాడు.

వోరోషిలోవ్

63 ఏండ్లు వయస్సుకల వియాచెస్లావ్ మాలటోవ్ ఉపప్రధానిగానే గాక విదేశాంగమంత్రిగాకూడా నియమించబడినాడు.

లొవ్రెంటీ బెరియా ఇదివరకువలెనే పోలీసుశాఖకు మాత్రమే కాక అంతరంగిక వ్యవహారాలశాఖకుకూడా ఆధిపత్యం వహిస్తారు. ఇదివరకు దేశరక్షణశాఖ అనగాపోలీసు శాఖ వేరుగానూ అంతరంగిక వ్యవహారాలశాఖ వేరుగానూ వుండేవి. ఇప్పుడవి రెండూ ఏకీకరించబడి బెరియా వాటికి అధిపతిగా నియమించబడ్డాడు.

స్టాలిన్ బావమరది లాజార్ కగానొవిచ్, బెరియా, మాలటోవ్, బల్గనిన్ వీరునల్వురు ఉపప్రధానమంత్రులుగా కూడా వ్యవహరిస్తారు. బల్గనిన్ తప్ప తక్కిన ముగ్గురు స్టాలిన్‌క్రింద యిదివరకు ఉపప్రధానాలుగా పనిచేసినవారే.

మాస్కో రేడియో ప్రకటించిన మరికొన్ని వివరాలు ఇవి —

మాజీ ఉపప్రధాని నికొలాయ్‌బల్గనిన్ (వయస్సు 57 ఏండ్లు) యుద్ధశాఖామంత్రిగా నియమించబడినాడు.

రష్యా మాజీ విదేశాంగ మంత్రి ఆంద్రీవిషిన్స్కి ఐక్యరాజ్య సమితిలో రష్యా తరఫున శాశ్వత ప్రతినిధిగా వ్యవహరిస్తాడు.

స్టాలిన్ అంత్య సంస్కారాల పర్యవేక్షణకు నియమించబడిన సభ్యులు 7 గురిలోను ఒకరైన ఎన్. షిగోవ్ సుప్రీం సోవియట్ అధిష్ఠాన వర్గానికి కార్యదర్శిగా నియమించబడినాడు.

నికొలాయ్ ష్వెర్నిక్ సోవియట్ [illegible]

[illegible]

1. మాలెంకోవ్; 2. బెరియా; 3. మాలటోవ్; 4. వొరొషిలోవ్; 5. [illegible]; 6. బల్గనిన్; 7. కగనోవిచ్; 8. [illegible]; 9 [illegible] 10. [illegible].

స్టాలిన్‌స్థానే రష్యా ప్రధాన మంత్రి అయిన జార్జి మాలెంకోవ్

## లెవీ ఉత్తరువుక్రింద ధాన్యం ధరల నిర్ణయం

### వెంటనే అమలుకు ప్రభుత్వాదేశం

మదరాసు, మార్చి 7: తూర్పుగోదావరి, పశ్చిమ గోదావరి, కృష్ణా, గుంటూరు, తంజావూరుజిల్లాలలో ఆహార ధాన్యముల లెవీ వుత్తర్వుక్రింద ఇచ్చేధాన్యము, బియ్యమునకు ప్రభుత్వం ఎఫ్ సి ఆర్ ధర, ఎక్సుమిల్లు ధరలను నిర్ణయించి మదరాసు ఆహారధాన్యముల లెవీ సేకరణ (ధరకంట్రోలు) వుత్తర్వును గెజెటులో ప్రకటించింది.

వెంటనే అమలులోకివచ్చిన ఈ వుత్తర్వు లెవీ సేకరణ వుత్తర్వుక్రింద వసూలు చేసే ధాన్యము, బియ్యానికి వర్తిస్తుంది.

ఎఫ్. సి. ఆర్. ఎక్సు మిల్లు ధరలు [illegible]

[illegible]

రు 14-8-0 లు, రెండవ రకం రు 13-12-6 లు.

తంజావూరు: ధాన్యం మొదటిరకం రు 9-15-6 లు, రెండవరకం రు 9-7-9 లు బియ్యం మొదటిరకం రు 14-12-9 [illegible]

[illegible]

ధాన్యం, బియ్యం ఎక్సుమిల్లు ధరలు

[illegible]

జిల్లా బోర్డు ఎన్నికలు వాయిదా

[illegible]

మాలటోవ్

## రష్యా కొత్త నాయకత్వం: అమెరికా విధానం

### ఆకస్మిక మార్పు లేవీ వుండవట

వాషింగ్టన్, మార్చి 6: మార్షల్ స్టాలిన్ అనంతరం ఏర్పడ్డ కొత్త సోవియట్ ప్రభుత్వం అన్నీ సర్దుబాటుచేసుకుని నిలబడేవరకూ, అమెరికా విదేశాంగవిధానంలో కానీ, సైనికవిధానంలో కాని ఆకస్మికమార్పులు ఉండకపోవచ్చునని తెలుస్తున్నది

కొత్తపాలకులకు ఆగ్రహం కలిగించే ప్రకటనలేమీ చేయకుండా అమెరికా విదేశాంగ శాఖోద్యోగులు శిక్షణ పొందుతున్నారని, సైనికోద్యోగులు కూడ రష్యనుకానీ, తన సహచరులను కాని అందోళన పెట్టేటట్లుగా ఆకస్మిక మార్పులు రాకుండా, జాగ్రత్త పడుతున్నారని తెలుస్తున్నది. కొత్త సోవియట్ ప్రభుత్వం పశ్చిమరాజ్యాలపట్ల ఎటువంటి వైఖరిని అనుసరిస్తుందో తేలే వరకూ అవిషయాలను కదిలించకూడదు అన్నదే అమెరికన్ అధికార వైఖరిగా తోస్తున్నది.

రష్యానుగురించి ఎంతో మంది ఎన్నో రకాల ఊహాగానాలు చేస్తున్నారు కాని, అసలు వ్యవహారాలు అందరికన్నా ఎక్కువగా తెలియటానికి అవకాశం ఉన్న పశ్చిమరాజ్య ప్రముఖులిద్దరు ప్రెసిడెంట్ ఐసెన్‌హోవర్, బ్రిటిషువిదేశాంగమంత్రి ఈడెన్ మాత్రం పూర్తిగా మౌనవ్రతం వహించారు. స్టాలిన్ జబ్బువార్త విన్నప్పుడు నిన్న వాళ్లిద్దరూ విడివిడిగా ప్రకటనలు చేస్తూ రష్యన్ల పట్ల తమ సద్భావాన్ని ప్రకటించారు. మరణవార్త వచ్చినమీదట ఐసెన్‌హోవర్ ఒకే ఒక వాక్యంగల సానుభూతి సందేశాన్ని పంపించారు.

ఈడెన్‌తో సంప్రదింపులు జరుపుతున్న అమెరికన్ విదేశాంగ మంత్రి డలెస్ కూడా వ్యాఖ్యానించటానికి నిరాకరించారు.

ఈ అవకాశం లభించకుండా చేయటమే అమెరికా ఉద్దేశమని న్యూయార్క్‌లోని అంతర్జాతీయవర్గాలు భావిస్తున్నట్లు అతడు తెలియజేస్తున్నాడు.

(6 వ పేజీ చూడుడు)

అమెరికా మౌనంలో అంతరార్థం

అయితే అమెరికా వత్త సోవియట్ నాయకులకు ఆగ్రహం కలిగించకుండా చేసి ఉంచటానికి అసలు కారణం ఒక [illegible]

[illegible]

## ఐక్య కర్ణాటక స్థాపనకు కృషి

### ఉత్తర కనరానివాసి ఆమరణ నిరాహారదీక్ష

హుబ్బళి, మార్చి 6: ఐక్య కర్ణాటక రాష్ట్రస్థాపనను ఉద్దేశించి ఇక్కడికి 30 మైళ్లదూరం లోవున్న ముండగోడులో నారాయణ అచ్యుతరావు అనే 26 సంవత్సరాల వయసుగల వారు ఉత్తర కనరా జిల్లా) నిన్నటిదినం ఆమరణ నిరాహారదీక్ష ప్రారంభించినట్లు తెలుస్తున్నది.

నిరాహారదీక్షకు ఉపక్రమించ బోయే ముందు సాయంత్రం ఒక సభలో ప్రసంగిస్తూ, తన [illegible] రాష్ట్రపతి రాజేంద్రప్రసాదుగారికిన్నీ, ముఖ్యమంత్రి నెహ్రూగారికిన్నీ నెలనాళ్ల ముందరనే తెలుపుతూ లేఖ వ్రాసినట్లున్నీ [illegible]

[illegible]

శ్యామప్రసాద్ ముఖర్జీ, ఎన్. సి. చటర్జి

## లాల్ శర్మ ప్రభృతుల అరెస్టు

### ఢిల్లీలో నిషేధాజ్ఞ ధిక్కరించడానికి ప్రయత్నించిన ఫలితం

న్యూఢిల్లీ, మార్చి 6: ఊరేగింపులు, ప్రదర్శనలు చేయరాదనే ఉత్తరువును ఉల్లంఘించినందుకు జనసంఘ అధ్యక్షుడు, పార్లమెంటు సభ్యుడు అయిన డా॥ శ్యామప్రసాద్ ముఖర్జీని, హిందూమహాసభాధ్యక్షుడు శ్రీ ఎన్. సి. ఛటర్జీని, రామరాజ్య పరిషత్తు అధ్యక్షుడు శ్రీ నందాలాల్‌శర్మను, ఇంకా 19 మందినీ నేడు ఇక్కడ అరెస్టు చేశారు.

కాశ్మీరును భారత దేశంలో పూర్తిగా కలిపివేయాలని జమ్మూ ప్రజాపరిషత్తు చేస్తున్న ఆందోళనకు దోహద మివ్వడానికి నగర మధ్యభాగమునవున్న చాందినీ చౌకునుంచి ఊరేగింపు బయలుదేర దీయడానికి వీరు ప్రయత్నించారు. జమ్మూ పోలీసు కాల్పులలో

(6-వ పేజీ చూడుడు)

హిందూమహాసభ అధ్యక్షుడు శ్రీ యన్. సి. ఛటర్జీ

## ట్రిగ్వేలీస్థానే సమితిప్రధాన కార్యదర్శిగా శ్రీమతివిజయలక్ష్మి?

ఐక్యరాజ్య సమితి, మార్చి 6: ట్రిగ్వేలీస్థానే ఐక్యరాజ్య సమితి ప్రధానకార్యదర్శి అయ్యే అవకాశమున్నట్లు భావింపబడుతున్న వారి పేర్ల జాబితాలో భారతదేశప్రతినిధి శ్రీమతి విజయలక్ష్మి పండిట్ పేరు ఉన్నత స్థానం ఆక్రమిస్తున్నట్లు సమితి లాబీలలో వదంతులు విస్తృతంగా వ్యాపించివున్నవని పి. టి. ఐ. ప్రత్యేక విలేఖరి శ్రీ డి. వి. వాగిల్ సమితి కార్యస్థానమునుండి తెలుపుతున్నాడు.

ఐక్యరాజ్యసమితి వర్గాలవ్యక్తులన్ని సెక్రటరీ జనరల్ ఉద్యోగానికి ఎవ్వరిని నియమిస్తారనే విషయంపై కేంద్రీకృతమై వున్నాయని వాగిల్ తెలుపుతున్నాడు.

ట్రిగ్వేలీస్థానే మరొకరిని నియమించడానికి తాను వీలైతే ఒక వారం రోజులలోపుగా సభ సమావేశపరుపవచ్చునని మార్చి మాసంలో భద్రతా సంఘ అధ్యక్షుడయిన ప్రొ॥ ఆస్మన్ బుకారీ లిక అంతరంగికులతో అన్నారు.

ఈఉద్యోగం కోసం దేవ్వరూ స్వయంగా ప్రచారం చేయ వీలులేదు. కనుక తెరవెనుక జరుగుతున్న సంప్రదింపులలో [illegible]

[illegible]

## 'స్టాలిన్‌లో కొన్ని ఉదాత్తగుణాలున్నవి'

### వినోబాభావే అభిభాషణ

చాండిల్, మార్చి 6: "మార్షల్‌స్టాలిన్ కాలధర్మం చెందడంవల్ల ఒక్క రష్యాకే కాదు, సర్వప్రపంచానికి నష్టం వాటిల్లింది" అని నేడు ఆచార్య వినోబాభావే ప్రార్థనా సమావేశంలో మాట్లాడుతూ అన్నారు.

"స్టాలిన్‌లో కొన్ని ఉదాత్తగుణాలు, లక్షణాలు వున్నాయి. అందువల్లనే ప్రపంచంలో ఆయనపట్ల ఇంతమందికి గౌరవం, మర్యాద ప్రబలివున్నాయి. స్టాలిన్‌లోని ఆ ఉదాత్త గుణాలను ప్రపంచం ఎన్నడూ మరిచిపోలేదు" అనిభావే ఆయనఅన్నారు.

ప్రపంచ కమ్యూనిజంకు, మార్క్సు, లెనిన్, స్టాలిన్‌లు ఆచార్యులని, అయితే, లెనిన్‌కు, స్టాలిన్‌కు తెలియకుండానే, కమ్యూనిజం ఎన్నో కొత్త పరిణామాలను పొందిందని, హింసను వర్జించకపోవడంవల్ల మహా ఉదాత్త భావాలుకూడా వికటరూపాల్ని పొందడం జరుగుతున్నది గనుక, రాజకీయ వేత్తలు, సమవిదులు ఈ విషయాన్ని గుర్తించి హింసనువర్జించడం మంచిదని ఆచార్యభావే ఈ సందర్భంలో ఒక హెచ్చరిక చేశారు.

సి. వి. రామన్

శ్రీ సి. వి. రామన్ స్టాలిన్ మరణవార్తనువిని, చాలా విచారించారు. స్టాలిన్ మనుష్యుని ప్రతిభా శక్తిని ఉద్దీపింప చేయడానికి బహుమానాలు ఇవ్వ ఏర్పాటుచేసి ఎంతో కృషి చేశారు. ఈ బహుమానాలవల్ల విజ్ఞానాభివృద్ధికి మంచి దోహదం లభించిందనడంలో అనుమానం ఏమీలేదు అన్నారు.

లోటుభర్తీ అవుతుందని రాజాజీ ప్రకటన

శ్రీ మాన్ రాజగోపాలాచారిగారు గూర్ విరూపాక్షియంలో వుండగా స్టాలిన్ మరణించాడన్న వార్తను పత్రికా విలేఖరులు ఆయన చెవిని వేశారు. ఆయన వెంటనే లేన సానుభూతిని ఈ విధంగా వ్యక్తం చేశారు. "మరణం జీవులకు సహజమైన విషయం. లోక వృత్తం మామూలుగా జరిగిపోతూ వుంటుంది. ఇప్పుడు ఏర్పడిన ఈ లోటు తిరిగి త్వరలోనే భర్తీ అవుతుంది."

విజయవాడలో స్టాలిన్‌కు జోహార్లు

బెజవాడలో స్టాలిన్ మరణవార్త

(6 వ పేజీ చూడుడు)

## శాస్త్రవిజ్ఞానాభివృద్ధికి ప్రాచీన భారతదేశం చేసిన కృషి

### ప్రపంచ ఆరోగ్యసంస్థ ప్రతినిధి ప్రశంస

బొంబాయి, మార్చి 6: శాస్త్రజ్ఞానాభివృద్ధికి ప్రాచీన భారతదేశం చేసిన కృషిని భారతదేశానికి వచ్చిన ప్రపంచ ఆరోగ్యసంస్థ రాయబారవర్గ నాయకుడు డా॥ [illegible] లెవిన్ నేడు యిక్కడ శ్లాఘించారు.

బొంబాయి విశ్వవిద్యాలయంవారు రాయబారవర్గ సభ్యులకు చేసిన సత్కార సభలో సమాధానమిస్తూ డా॥ లెవిన్ ఇలా అన్నారు.

"గణితశాస్త్రంలో భారతదేశం అంకెలను, [illegible] [illegible] దశాంకమును, [illegible] ప్రపంచానికి ప్రసాదించింది. వైద్యశాస్త్రాభివృద్ధికి కూడా ప్రాచీన భారతదేశం చాలా కృషి చేసింది. ప్రసూతి శాస్త్రవిషయాలు, [illegible], శస్త్రచికిత్సలలో ఉపయోగించబడిన పనిముట్లు [illegible]

[illegible]

[illegible]

నగరంలో ఈ రాయబారవర్గంవారి నాలుగురోజుల కార్యక్రమాన్ని ప్రారంభించడానికి చేసిన సత్కారంలో బొంబాయి ఆర్థికశాఖమంత్రి డా॥ జీవరాజ్ మెహతా ఉపన్యసిస్తూ ప్రపంచప్రసిద్ధులైన వైద్యశిఖామణులరాక భారతీయులకు, [illegible] [illegible]

[illegible]

శ్రీ పంటా గోపాలకృష్ణయ్య అండ్ కంపెనీవారి యాజమాన్యమున, యిటీవల గుంటూరు తాలూకా వరదూరులో స్థాపింపబడిన 'టుబాకో రి డ్రైయింగ్' ఫ్యాక్టరీ. దీనిలో స్త్రీ పురుషులు వేయిమందికి పైబడి పని చేస్తున్నారు.

వరదూరులో స్థాపింపబడిన 'టుబాకో రీ డ్రయింగ్' ఫ్యాక్టరీ నిర్వాహకులు: (ఎడమనుంచి) శ్రీ పంటా గోపాలకృష్ణయ్య గారు (యజమానులలో ఒకరు); శ్రీ పి. రఘునాథరావుగారు, టుబాకో ఏజెంట్, లండనులో ప్రోకరు, శ్రీ రోజ్ (పారిస్) టుబాకో ఎక్స్‌పర్టు; శ్రీ పంటా కృష్ణారావుగారు, టుబాకో స్పెషలిస్టు (మానేజింగ్ ప్రొప్రైటర్)

## కొమరులోయ రిజర్వాయరు

నల్లకొండ
మాదిగ కొండ
మెట్ట
పెద్దూరి కొండ
రిజర్వాయరు ప్రదేశము లోతైన ప్రదేశము
రిజర్వాయరు ప్రదేశము లోతైన ప్రదేశము
అల్లి కొండ
బొంతు కొండ
దమా కొండ
అడ్డు కొండ
ఆనకట్టు ప్రదేశము
ఆనకట్టు ప్రదేశం

ఆవ పొడవు 8 మైళ్లు— వెడల్పు 3 మైళ్లు

# కొమరలోయరిజర్వాయర్

### శ్రీ పిళ్లా కనకయ్యా నాయుడు

విశాఖపట్నం జిల్లాలోని దరు సర్వ శ్రీ తా॥ లోని పంటభూములకు సరియైన నీటివసతులు లేక యేటేటా అతివృష్టి అనావృష్టులతో రైతులు బాధపడుతూవున్నారు. యీ సంవత్సరం కాని కొ సంవత్సరం పంటలుపండునో అని రైతులు భయాందోళనలతో చే కాలం గడుపవలసివస్తూ యున్నది. స్థిరమైన నీటి వసతులు కలుగజేయమని మేము ఎన్నాళ్లనాడో ఎంతగానో ఆందోళన చేయుచున్నప్పటికి ప్రభుత్వం మా ఆందోళనను గుర్తించి మా నీటియిబ్బందిని నివారింపజేసి మాకు సుస్థిర నీటివసతులు కలుగజేసి యుండలేదు.

మా తాలూకాలు శారదా, వరహా నదులనీరు ప్రవహించుచున్నాయి. గాని ఆనదులు వర్షాలకు ప్రవహించడం ఎండలకు ఎండిపోవడమే గాని ఎల్లప్పుడు ప్రవహించవు. దూరపుకొండల్లో కురిసినవర్షాలే యీనదుల జీవనం కాగా నిరంతరము వెంటనే సముద్రములో కలిసిపోతూవుంటాయి. వాటికి ముగ్ధలింగేశ్వర ఆలయంవద్ద శారదానదికి ఒక రిజర్వాయరును, ఇంటికొమ్మవాకవద్ద వరహానదికి ఇంటికొమ్మవాక రిజర్వాయరును నిర్మించినచో యీ ఒక్క తాలూకాకేగాక అనకాపల్లి, చోడవరం, నరసీపట్నం తాలూకాలకుకూడా ఎక్కువగా తోడ్పడి జిల్లా ఆహారసమస్యను పరిష్కరించి వేయును. (యింతకుపూర్వమే లోకసభ శాసనసభలోనూ ఎమ్. ఎల్. ఏ. గారైన శ్రీ అప్పల బాపునాయుడుగారిద్వారా అలజడి చేయించాము. సభలు జరిపించి తీర్మానాలు పంపించాము. యింకా ఎన్నోవిధాల ఆందోళన సలిపాము గాని ప్రభుత్వం గమనించలేదు.

ఈ తాలూకాలో కొంతభాగం కొండకర్ల లోయనీటిపై ఆధారపడుచూ వున్నప్పటికీ లోయనీరుకూడా లోయ దిగువ రైతులకు అవసరం లేనప్పుడు మాత్రమే వల్లి నీటిక్రింద యేదో కొన్ని తడులుగా తడులు తోస్తుందారు. అందువల్ల కొండకర్ల లోయవల్లకూడా అంతగా ప్రయోజనం కనపడు దారి లేదు.

కొండగెడ్డలైన శేషిగెడ్డ ఎడ్లగెడ్డ తుమ్మలగెడ్డ మొదలగుగెడ్డలెన్నో వున్నాయిగాని అవియన్నియు వరద పోతే సముద్రానికి గాని మధ్యే మార్గం లేదు. కాబట్టి యీ తాలూకా కరువుతాలూకాగా నిత్యము దారిద్ర్యావస్థలో మునులవలసి వచ్చుచున్నది. మాకు కొండగెడ్డల ద్వారా కావలసినంత నీరు లభించగలదు. కాని దానిని రిజర్వుచేసివుంచి సక్రమముగా సకాలములో పంటభూములకు అందించే దిక్కు లేక ఆ నీరంతయు పంటభూముల ప్రక్కనుండే సముద్రగర్భమున కలిసిపోవుచున్నది. అలాగాకుండా సదరు కొండగెడ్డలైన ఎడ్లగెడ్డ, తుమ్మలగెడ్డ, శేషిగెడ్డలను ఆ గెడ్డలు పుట్టిన చోటునే ఒక రిజర్వాయరు (అవ) నిర్మించినచో కొండకర్ల అవసరం లేకుండగానే మా తాలూకా నీటి యిబ్బందినే నివారింపజేసి ఎంతో పంటకు గ్యారంటీ కలుగజేయగలదు.

సదరు ప్రదేశమును 17-2-53 తేదీన శ్రీ పప్పల బాపునాయుడు యం. యల్. ఏ. గారు, పట్టణ కిసాన్ సమితి కార్యదర్శి అచారి అప్పలనాయుడుగారు, కొక్కిరాపల్లి పంచాయితీబోర్డు ప్రెసిడెంటు శ్రీ గొర్రెల నూకనాయుడుగారు, కొక్కిరాపల్లి గ్రామమునసబు శ్రీ పాలకా చిన్నం నాయుడుగారు శ్రీ కొ తారు సన్యాశినాయుడుగారు, శ్రీ పెన్మెత్స భారతీరావుగారు, యింకా దాదాపు 50 మంది రైతులు వెళ్లిచూచారు.

పెదపల్లి అడవిప్రక్కన ప్రకృతి ప్రసాదితమైన యీరిజర్వాయరు (అవ) (1) బొంతుకొండ, (2) దమాకొండ, (3) అడ్డుకొండ, (4) పెద్దూరుకొండ, (5) మాదిగకొండ, (6) నల్లకొండ, (7) అల్లికొండలను పర్వతపంక్తులతో స్వతసిద్ధముగా ప్రకృతి మాతయే తీర్చిదిద్దినట్లుగా వున్నది. చుట్టూ ఎత్తయిన పర్వతపంక్తులమధ్యగల ఆ ప్రదేశము లోయ 8 మైళ్లు పొడవుగలిగి, 3 మైళ్లు వెడల్పుగలిగిన అడవిప్రదేశమై యున్నది. యీ అడవి పెద్దపెద్ద మానులతో గాక అంతా చిట్టడవిగాయున్నది. యీ కొండలన్నియు ఒకదానితో ఒకటి చేర్చి నుదుపట్టిన పెద్దగట్టుగా నాలుగు వైపుల అలముకొనియున్నది. యీ రిజర్వాయరు (అవ)కు తుమ్మలగెడ్డ, ఎడ్లగెడ్డలు ప్రవహించు ముఖద్వారమైన "కొమరలోయ"వద్దయున్నూ, శేషిగెడ్డ ప్రవహించే ముఖద్వారమైన, గడ్డిరాజువాక దారివద్దనున్నూ రెండు అడ్డకట్టలు మాత్రం కట్టవలసియున్నది. కొమరలోయవద్ద 150 గ॥ల పొడుగున, గడ్డిరాజువాకవద్ద 500 గ॥ల పొడుగున అడ్డకట్టలుకట్టి డాములు నిర్మించవలెను.

ఈ అవప్రదేశమంతయు ప్రభుత్వపు అడవిక్రిందనే వున్నందున ఎవరికీ ఏటి యిబ్బందిగాని, కష్టనష్టాలుగాని వుండవు. పనికూడా స్వల్పము. భూమికి పరిహారం యివ్వనక్కరలేదు. యీ పనులకు యించుమించు ఒకలక్ష యాభై వేలకంటె ఎక్కువ ఖర్చు అవదని నా తలంపు. యీ అవప్రదేశంలో గల చిట్టడవిని వేలంపెట్టి విక్రయించివేసినచో, 70, 75 వేలవరకు రావచ్చును. దీనికితోడు రైతులు శ్రమదానము సొమ్ము యిచ్చుటకు సిద్ధముగానున్నారు. ప్రభుత్వంవారు 40, 50 వేలమాత్రం ఖర్చుపెట్టినచో తాలూకా సాగుభూమిలోని 40, 50 వేల ఎకరముల పల్లం, మెరకభూములేగాక యీ అవ సదుపాయంవల్ల క్రొత్తగా సాగులోకి వచ్చే 3 4 వేల ఎకరముల పోరంబోకు కూడా సుక్షేత్రమై పంటలుపండి తాలూకా ఆహారసమస్యను పరిష్కరించేగ్యారంటీ యేర్పడగలదు. పసగలదు. పైగా యీ కొండగెడ్డల తీవ్రతవల్ల కలిగే యీతిబాధలు, వరద ప్రమాదాలు అతివృష్టి అనావృష్టి దోషాలు తొలగి దక్కని పంటలు పండగలవు. యీ (అవ) రిజర్వాయరుకు దక్షిణమున వరహానది గలదు. యిక్కడ ఒక కొండను తవ్వుమాత్రం కొట్టి ఒక కాలువ నిర్మించినచో వరహానది తాలూకు అధికనీరు కూడా యీ అవకు మళ్లించవచ్చును.

దీనిని "కొమరలోయ రిజర్వాయరు" అను పేరుతో 1924 సం॥రంలో అప్పటి ప్రభుత్వం యీ రిజర్వాయరు (అవ) నిర్మాణానికి కొంతకృషి చేసియున్నది అప్పటి దీని తాలూకు విశాఖ జిల్లా P. W. D. వారి ఆఫీసులో వున్నది. దానిని ప్రభుత్వ పునఃపరిశీలన జరిపించి యీ రిజర్వాయరు (అవ) నిర్మాణానికి పూనుకొని కూడా నీటి యిబ్బందిని రూపుమాపి తాలూకా అభివృద్ధికి దోహదమిప్పించ కోరాను.

యిటువంటి రిజర్వాయరు యేది లేకపోవుట చేతనే గదా యీ సంవత్సరం యీ తాలూకా పూర్తిగా పంటలు పోయి మహాకరువు పుట్టి క్షామ దేవతకు నిలయమై పోవుచున్నది. రైతులే పంటలు కోక బజారుబియ్యం తింటూవుంటె యిక కూలివానిగతి యేమి కానున్నదో భగవంతునికే ఎరుక. కొన్ని ప్రదేశములలో కొందరు కూలీలు అప్పుడే వలసలు ప్రారంభించారు. గాన తాలూకా భవిష్యత్తును గుర్తించి యైనను ప్రభుత్వం యీ రిజర్వాయరు నిర్మాణానికి పూనుకొన గోరుచున్నాను.

యీ రిజర్వాయరు విషయమై తాలూకా జిల్లా కిసాన్ శాఖలు వారు రైతులు, కృషికార్ పార్టీ M. L. A. లు గట్టిగా పట్టుబడి నీటితో కృషిచేసి తాలూకా నీటికి ముప్పును నివారించుకొన గోరెదను.

పంటలు పోయినందుకు ఖర్మను, దేవుణ్ణే నిందించక రైతులు దమయిక ముఖమున తీవ్ర ఆందోళన జరిపి కృతకృత్యులై సుఖించగోరెదను.

# సెస్బేనియా మొక్కలు

### శ్రీ పర్వతనేని వెంకటరత్నం

ఈ సంవత్సరం జూన్ నెల మొదటి వారములో, కతినారు పెంపు నారుమళ్లలో, వరి విత్తులతోబాటు ఒకప్రక్కను, సెస్బేనియా విత్తులు చల్లి మడిగట్టితిని. నారు, మడి తడిసినప్పుడు సెస్బేనియా మడి తడిపి నారు పెంచితిని. వరినారు వేత నాటికి సుమారు ఒక గజముఎత్తు పెరిగినది. మా గాణి భూమి నాట్లు పూర్తికాగానే, సెస్బేనియా మొక్కలను మాగాణి గట్టుమీద రెండు గజములకు ఒకటి చొప్పున మడిలో నీటిమట్టమునకు పైన సుమారు ఒక అనుగు లోపున గట్టు చివర భాగమందు నాటించితిని. ఈ దినమునకు నాటిన మొక్కలు సుమారు 4 గజములుఎత్తు పెరిగి చాల బాగున్నవి. చెట్లు పువ్వులతోను, కాయలతోను నిండియున్నవి. ఒక్కొక్క మొక్క మనము పశువులకు మేపే అరు జనప కట్టంత పరిమాణము గలిగియున్నది. విత్తులు తీసికొనినపిదప నారుచెట్లు వరికి బండిమీద కట్టపయోగించుకొని మనము వరిచేలోకోస్తే ఒక జనప కొయ్యబండి యంతయగును.

మన డెల్టా భూములలో వరిమళ్లు రెండు యకరములు పరిమాణము గలిగియుండును. రెండు యకరముల మడికి చుట్టూవుండే గట్లు సుమారు 380 గజములు విస్తీర్ణము గలిగియుండును.

ఇందులో 100 గజములు రహదారి ఉపయోగపడినా ఇంకా 280 గజములుండును. మిగిలిన గట్లమీద రెండు గజముల కొకటి చొప్పున 140 మొక్కలు పెంచవచ్చును. పెంచిన వాటిలో వి పది మొక్కలలో మన అజాగ్రత్తవలన పోయినా యింకా 130 మొక్కలుండును.

ఈ మొక్కలనుంచి మనము విత్తులు తీసికొని తరువాత నాటిని వరికి జాగ్రత్తపరచినయెడల, ఒక పెద్ద బండియగును అనగా ఒక పెద్ద నిడిగడ్డి బండియంతయగును. ఒక యెకరము భూమికి ఎరువు కొంత తీర్చును. ప్రకాండము గట్టిగా లేనందున వంటచెరుకుగా నుపయోగపడదు. పశువుల మేతకును వికరించదు, ఈ కారణమున దీని నెవ్వరు దొంగలించరు. ఈ మొక్కకు కీటకాది బాధలు తక్కువ. మా గాణిభూమిలో త్వరగా చీకిపోవును.

నానాట పెరుగుచున్న పన్నుల వల్లనున్నూ, కూలివగైరా ఖర్చులు పెరుగుటనుబట్టియు, చాల హెచ్చు పంటలేనిదే రైతుకు సుఖజీవనము దుర్లభము. హెచ్చు పండించుటకు ఎరువు ముఖ్యావసరము. అది దైనందిన [illegible] వంటి దొరకుట దుర్లభము. [illegible] పెంటపోగులు [illegible] ఉపయోగించబడుచున్నవి. [illegible] ఎరువులతోబాటు స్థూలపు (Bulky manures) (చెత్త ఎరువులవంటివి) వేయనందువల్ల భూములు చెడిపోవుటయే గాక కిమ్మత్తుకు తగినంత హెచ్చుపంట పట్టుటలేదు. కనుక హెచ్చుపంట పండించుటకు పచ్చి పేడెరువుకూడ ముఖ్యము. ఇది అట్టికొరతదీర్చు మహాకల్పవృక్షము. దీనిని పైచెప్పిన విధమున పెంచి ధన్యులగుదురని విశ్వసించుచున్నాను.

ఈ మొక్కలను పెంచినందున గట్లమీద పశువులకు పెంచబడు మినుము వర్గ లా పైరుల కిబ్బంది యుండదు. వరిపైరుకు నీడ యిబ్బంది యుండదు.

మనకుండే పెంటపోగులు మినప పొట్టులో చెట్లుచేర్చి కాలమంతటికి వచ్చునట్లు వరి దానిపైన యకరమునకు ఒక బస్తా పిండిజాతి ఎరువు 80 పౌనుల అమ్మోనియం సల్ఫేటు 100 పౌనుల సూపరుఫాస్ఫేటు వేసినా నా తావరణతోటు క్రిమికీటకాది బాధలేనియెడల యకరమునకు 3,500 వరకు పంట పెరుగగలదని విశ్వసించుచున్నాను.

(పాడి-పంటలు)

# విదేశీ పెట్టుబడులకు షరతులు

### భారతప్రభుత్వ ప్రకటన

న్యూఢిల్లీ, మార్చి 8: విదేశీయ పెట్టుబళ్ళను తిరిగి స్వదేశం చేర్చే విషయమై భారత ప్రభుత్వంవారు ఈ క్రిందిప్రకటన చేస్తున్నారు: "1950 సం॥ జనవరి 1 తరువాత భారత ప్రభుత్వంవారు ఆమోదించిన ప్రాజెక్టులలో స్టర్లింగు ప్రాంతాలలో చేరని దేశాలు మదుపు పెట్టిన ద్రవ్యాన్ని తిరిగి పట్టుకు వెళ్లడానికిగల మారకపు నియమాలను సడలిస్తున్నట్లు 1950 సం॥ జూన్ 2 వ భారత ప్రభుత్వంవారు ప్రకటించారు. హెచ్చిన పెట్టుబడిద్రవ్యం విలువను మాత్రం తిరిగి స్వదేశం చేర్చే సౌకర్యం నుంచి మినహాయించారు. పెట్టుబడి ద్రవ్యంవల్ల సమకూరిన లాభాలన్నీ భారత ప్రభుత్వ అంగీకారంతో వ్యాపారంలో పెట్టినదానిని మాత్రమే తీసుకొని పోవడానికి అంగీకరించారు.

ఈ విధానాన్ని ప్రభుత్వంవారు పునః పరిశీలించారు. వాంఛనీయమైన మార్గాల్లో విదేశీయ పెట్టుబళ్లను ప్రోత్సహించడానికిగాను ఈ మినహాయింపును ఉపసంహరించుకొన భారత ప్రభుత్వం వారు యిప్పుడు నిశ్చయించారు.

దీనను సారం స్టర్లింగు ప్రాంతంలో చేరని దేశాలవారు, నార్వే, స్వీడెన్, డెన్మార్కులవారు ఈక్రిందిసూత్రాల ననుసరించి పెట్టుబళ్ల అమ్మకంనుండి వచ్చిన ద్రవ్యంనుండి పెట్టుబడిద్రవ్యం తీసుకొని వెళ్లవచ్చును.

(1) భారత ప్రభుత్వం ఆమోదించిన ప్రాజెక్టులలో 1950 సం॥ జనవరి ఒకటి అనంతరం పెట్టుబడిపెట్టిన ద్రవ్యాన్ని తరువాత యెప్పుడైనాసరే హెచ్చిన పెట్టుబడిద్రవ్యం విలువతో సహా తీసుకొని వెళ్లవచ్చు.

స్టాక్ ఎక్స్చేంజీలో కొన్నవాటిలకు యిది వర్తించదు. 1950 సం॥ జనవరి 1 తరువాత భారత ప్రభుత్వం ఆమోదించిన ప్రాజెక్టులో పెట్టుబడి పెట్టిన ద్రవ్యంలో అంతర్భాగంగా వున్నదాన్ని మాత్రమే వారు తీసుకొని వెళ్లవచ్చును."

# దేశంలోని విదేశీయ సంస్థలలో దేశీయ విదేశీయ ఉద్యోగుల నిష్పత్తి

గత జూలై 31 వ తేదీన, భారతదేశంలో వ్యాపారంచేస్తున్న విదేశీయసంస్థల నన్నిటిని, భారతప్రభుత్వం, ఆయాసంస్థలలో పనిచేస్తున్న దేశీయ విదేశీయ ఉద్యోగుల వివరాలను తెలుపవలసిందిగా కోరింది. పరిశ్రమలు, వాణిజ్యం, బ్యాంకింగ్, భీమా వ్యాపారాలు, తోటలు, మేనేజింగ్ కంపెనీలు మొదలైనవాటిని నిర్వహించుచున్న అన్ని సంస్థలనుంచి వివరాలు సేకరించటానికి ప్రయత్నం జరిగింది 1947 జనవరి 1 వ తేదీనుంచి 1952 జనవరి 1 వ తేదీవరకూ ఏ యే సంవత్సరాలలో యెంతెంతమంది పని చేశారో, వివరాలు సేకరించారు. ఈ లెక్కలవల్ల ఈ దిగువ వివరాలు తేలుతున్నయి.

విదేశీ యజమాయిషీక్రింద నడుస్తున్న 1,000 పైచిలుకు సంస్థలలో (1952లో) [illegible] దేశీయులు, నూటికి 75 మందివరకూ వున్నారు. క్రిందితరగతుల లో మాత్రం, అంటే రు 300—500, 500—600 జీతంతీసే తరగతులలో భారతీయులసంఖ్య అధికంగా వుంది. రు 300—500 వరకూ జీతంతీసేవారి సంఖ్య నూటికి 99 వంతులు వుంది; రు 500—600 జీతంతీసే వారి సంఖ్య నూటికి 85 వంతులు వుంది.

ఈ విదేశీయసంస్థలలో పనిచేస్తున్న దేశీయులసంఖ్య 1947 నుంచీ క్రమంగా అభివృద్ధిచెందుతోంది. కనిష్ఠతరగతిజీతం పుచ్చుకుంటున్నవారు 1947 లో నూటికి 96 గురు వుంటే, యిప్పుడు 99 మంది వున్నారు; మధ్యతరగతి జీతంతీసేవారు 1947లో 58%, ఇప్పుడు 85%, పెద్దజీతం, అంటే వెయ్యిరూపాయలకు పైబడినజీతం పుచ్చుకునేవాళ్లు 1947 లో 7.5%, 1952 లో 24 3%, ఈ తరగతిలో 1947 లో భారతీయులు 451 మందీ, విదేశీయులు 5,507 మందీ వుండేవారు. 1952 లో 2,137 మంది భారతీయులూ 661 మంది విదేశీయులూ వున్నారు. 1952 లో ఆయా సంస్థలలో ఈ పెద్దజీతాలు పుచ్చుకుంటున్న విదేశీయులవివరాలు, శతాంశరూపంలో ఇవ్వబడుతున్నాయి, బ్రాకెట్లలో యివ్వబడిన సంఖ్య 1947 వివరాలు.

| | | |
|---|---|---|
| బ్యాంకింగ్ : | 86 | (98) |
| భీమా : | 72 | (87) |
| వర్తకాలు : | 72 | (95) |
| మోటార్లవర్తకం : | 57 | (82) |
| మందులు, రసాయనిక పదార్థాలు : | 68 | (91) |
| లోహాలు వగైరా : | 66 | (100) |
| యంత్రాలు, ఎంజనీరింగ్ : | 70 | (92) |
| తోళ్లు, రబ్బరు : | 57 | (84) |
| ప్రజోపయోగ వ్యాపారాలు : | 52 | (85) |
| మేనేజింగ్ ఏజన్సీలు : | 75 | (90) |
| వాణిజ్యసంస్థలు : | 80 | (93) |
| పత్తిమిల్లులు : | 77 | (98) |
| నారమిల్లులు : | 93 | (99) |
| తోటలు : | 93 | (99) |
| బొగ్గుకంపెనీలు : | 63 | (80) |
| మాంగనీసు కంపెనీలు : | 60 | (87) |
| ఇతరఖనిజాలు : | 77 | (98) |
| పంచదార : | 84 | (97) |
| ఇతర చిల్లర సంస్థలు : | 72 | (87) |

ఈ విదేశీయులలో నూటికి 90మంది బ్రిటిషువాళ్లు; అమెరికనులూ, స్విస్ వారూకలిసి 5%; మిగతవారు నానాదేశాలకు చెందినవారు; 1947 నుంచి 1952 కు విదేశీయులసంఖ్య 7,162 నుంచి 7,658 వరకూ పెరిగింది. వీరిలో బ్రిటీషువారి సంఖ్య 6,495 నుంచి 6,820 కి పెరిగింది.

సంఖ్య
జీతములు
A: రు. 300—499
B: రు. 500—999
C: రు. 1000 & పైబడి
భారతీయులు
విదేశీయులు
8000 7000 6000 5000 4000 3000 2000 1000 0
A B C
1947 1948 1949 1950 1951 1952

అఖిల భారత వాణిజ్యమండలి మాజీ అధ్యక్షులు శ్రీ శాంతి ప్రసాద్ జైన్. నూతనాధ్యక్షులు శ్రీ ఆర్. జి. సరయ్యా. వాణిజ్యమండలి వార్షిక మహాసభను ప్రధాని జవహర్‌లాల్ నెహ్రూ 7 వ తేదీన ప్రారంభోత్సవం చేశారు.

ఢిల్లీలో 'మహిళాసంక్షేమ మహోద్యమ సంఘం'లో ప్రసంగించుచున్న శ్రీమతి ఇందిరా గాంధీ. ప్రక్కన శ్రీమతి [illegible] దేవి (అ. భా. మహిళామండలి అధ్యక్షురాలు) శ్రీమతి [illegible], శ్రీమతి [illegible], శ్రీమతి రామేశ్వరి [illegible] కూర్చుండియున్నారు.

# సినిమా

| | | |
|---|---|---|
| క్రౌన్ | పుట్టిల్లు | (తెలుగు) |
| శ్రీకృష్ణ, చిత్ర, రాజకుమారి | 'దాసి' | (అరవం) |
| కాసినో, పయొని | మైహోమ్ | ,, |
| పారగన్, ప్రభాత్, లక్ష్మి, కామధేను | మరుమగళ్ | ,, |
| సినిమా సెంట్రల్ | 'పాతాళభైరవి' | ,, |
| సరస్వతి | 'పణం' | ,, |
| మహారాణి | 'రాణి' | ,, |
| బిన్ | 'పరాశక్తి' | ,, |
| అశోక్ | 'అన్నదాత' | (హిందీ) |
| స్టార్ | 'ఆన్' | ,, |
| బ్రాడ్వే | 'ఆంధియాన్' | ,, |
| న్యూఎల్ఫిన్స్టన్ | ఝూన్సీకీరాణి | ,, |
| సెలెక్ట్ | 'బైజూబావరా' | ,, |
| వెల్లింగ్టన్ | 'మిస్టర్ సంపత్' | ,, |

## 'పుట్టిల్లు'

ఫిబ్రవరి 19 న ఆంధ్రదేశంలో విడుదల అయిన 'పుట్టిల్లు' తెలుగు సాంఘిక చిత్రాన్ని రాజా ప్రొడక్షన్స్వారు యీ 8 వ భవనీ స్టూడియోలో పత్రికలవారికి ప్రత్యేకంగా చూపించారు.

కథావస్తువు స్థూలంగాయిది:- చదువుల్లో ఆసక్తి కలిగిన ఒక బాలికను, ఆడదానికి చదువు లక్కరలేదనుకొనే తండ్రి, చదువుమాన్పించి ఒక మూర్ఖుని కిచ్చి పెళ్ళిచేస్తే, ఆ మూర్ఖుడు ఆమెను ఆమె పుట్టింటివారిని వూహించరానన్ని విధాలహింస పెట్టి, ఆమెనువదిలేస్తాడు. ఆ అమ్మాయికి చిన్నప్పుడు పరిచయమైన ఒక లేడీ డాక్టరు యీ కష్టదశలో యీమెకు ఆదుకొని నర్సు ట్రైనింగ్ యిప్పిస్తుంది. తద్వారా యీమె స్వతంత్రగా జీవించగల అవకాశం లభిస్తుంది. వ్యసనపరుడైన యీమె భర్త, ఆమె అర్జనసుఆశించి,మళ్లీ ఆమె సుదగ్గరకుతీయబోతే,ఆమె ముందుయిష్ట పడకపోయినా, చివరకు యిష్టపడ్డట్లు చిత్రంలో చూపించ బడింది.

ఆడపిల్లలు బడికిపోయి చదువుకోవటం అనేది అపచారంగా ఎంచబడిన పూర్వపు తరాలకు చెందిన కథను, బడికిపోని ఆడపిల్ల అంటూ యించుమించుగా లేకుండా పోయిన యీ నాడు చిత్రంగా తీసి చూపిస్తే ప్రేక్షకులు ఆదరించలేరు. స్త్రీ విద్య, సంఘంలో స్త్రీకి వుండవలసిన స్థానం యిటువంటి సాంఘిక సమస్యలను ఆధారంగా తీసుకొని సినిమా తీయాలని ప్రయత్నం చేసినందుకు రాజా ప్రొడక్షన్స్ వారిని అభినందించవలసిందే కానీ, ఆ ప్రయత్నంలో వారు కృతకృత్యులైనారని చెప్పటానికి వీలులేదు.

వీరు వేరుకొన్న కథలోని పాత్రలలో ఒక్కటికూడా ఏ ఘట్టంలోనూ ఒకచోట స్థిరంగా నిలబడి తమకొక వ్యక్తిత్వం వున్నట్టు ఋజువు చేసుకోవు. అదీకాక ప్రతి పాత్రకూడా మోతాదుమించి సృష్టింప బడింది. దానికి తగ్గట్టు పాత్రధారులందరూ కూడా, హాలులో చివరి తరగతిలో కూర్చున్న ప్రేక్షకుడికి తాము మాట్లాడే ప్రతిమాటా, ప్రతిఅభినయమూ ఎక్కడ వినిపించకుండా పోతుందో అన్నట్లు విగ్గరగా అరిచేస్తారు. సీనుకి సీనుకి సంబంధం అనేకచోట్లలేకుండ పోవటమే గాక, కొన్ని కొన్ని సీనులు కేవలమూ ఒకటిరెండు డైలాగులకోసమే సృష్టింపబడినట్లు తోస్తుంది.

నటకుల భావప్రకటనలో మార్పులు అతి నిదానంగా వస్తూ వుండటమూ, వాటికితోడు ఒకొక్క సీను ఆరంభమవటానికీ, అంతమవటానికీ అనవసరమైన జాప్యం జరుగుతూ వుండటమూ, సంభాషణలు వున్నప్పుడు తప్ప మిగిలినప్పుడంతా చిత్రం మూగచిత్రంగా నడుస్తూ వుండటమూ, యీ అన్ని కారణాల చేత ప్రేక్షకుడి సహనం అతి త్వరగా హరించుకుపోయే ప్రమాదం ఏర్పడింది.

వి. ఎన్. రెడ్డిగారు కొంత, అజిత్ కుమార్ గారు కొంతగా యీ చిత్రాన్ని ఫోటోగ్రాఫ్ చేశారు. మొత్తంమీద ఫోటోగ్రఫీ బాగా నేవుంది. సంగీతం జాసంది సంభాషణలలో చురుకు తక్కువగా వుంది. నాయికా నాయక పాత్రధారులైన జమున, రాజారావు గార్ల నటన రక్తికట్టలేదు. కోడూరు అచ్చయ్య, పెరుమాళ్లు, సురభి కమలా బాయి, మిక్కిలి నేని రాధాకృష్ణమూర్తి గారు అవకాశంవున్నంతలో చక్కగా నటించారు. 'వాంప్' పాత్ర ధరించిన సూర్యశ్రీలో ఆలకు బాలు ఎరువు తెచ్చుకొన్నవే వున్నాయి.

ఎప్పుడో కందుకూరి వీరేశలింగం గారు చనిపోయిన క్రొత్త రోజులనాటి పరిస్థితులు కావుంటా, యీ నాడు మధ్య తరగతుల వారి జీవిత పరిస్థితుల నే పునాదిగా చేసుకొని,లోలుతనం లేకుండా యింతకంటే కట్టుదిట్టమైన పాత్రలను సృష్టించుకొని, చక్కని కథ వ్రాయించుకుని, సినిమాలకి నాటకాలకీగల వ్యత్యాసాలను అనుభవ పూర్వకంగా తెలుసుకొన్న వారిచేత స్క్రిప్ట్ వ్రాయించుకొని వుంటే డా॥ రాజారావు గారి వుత్సాహము, వారితో యిన్ని విధాలసహకరించిన యింత మంది శక్తి సామర్థ్యాలు ఫలించివుండేవి.

* * *

## "దాసి" శత దినోత్సవం

విజయవాడ, మార్చి 6: రాజ్యం పిక్చర్సు వారి 'దాసి' చిత్రం శత దినోత్సవాలు నిన్న విజయవాడ రామా టాకీసులో శ్రీ హెచ్. యం. రెడ్డిగారి అధ్యక్షతన జరుపబడినవి. చిత్ర నిర్మాత శ్రీ మతి లక్ష్మీరాజ్యం, దర్శకత్వాన్ని పర్యవేక్షించిన శ్రీ యల్. వి. ప్రసాద్, దర్శకుడు శ్రీ సి. రంగనాథ దాసు, నటి శ్రీ మతి సూర్యకాంతం, నటులు శ్రీ యుతులు రేలంగి వెంకట్రామయ్య, యన్. టి. రామారావు, డాక్టరు దామోదరం, ఖలం గారలు, డిస్ట్రిబ్యూటరు సుందరలాల్ నహతా లదితరులు పాల్గొన్నారు.

శ్రీ హెచ్. యం. రెడ్డిగారు అధ్యక్షత వహిస్తూ చలనచిత్ర పరిశ్రమలో పెట్టుబడి పెట్టుటకు నిర్మాతలు, డిస్ట్రిబ్యూటర్లు భయపడుతున్నారని, విడుదల అవుతున్న చిత్రాలు ప్రజామోదాన్ని పొందలేక పోవటమే యిందులకు కారణమని వారు అన్నారు.

శ్రీ యుతులు శిరిపురపు కోటేశ్వరరావు, వింజమూరి శివరామారావు, అన్నవరపు సుబ్బారావు గుప్త, బాబా పండరి, కుమారి సి. రాజ్యలక్ష్మి, యన్. టి. రామారావు, ప్రసాద్, రంగనాథ దాస్, ఖలం, లదితరులు ప్రసంగించారు.

నిర్మాతల తరఫున, డిస్ట్రిబ్యూటర్ల తరఫున నటీ నటులకు, దర్శకులకు బహుమతులివ్వ బడినవి.

శత దినోత్సవ సందర్భంగా రామా టాకీసు పనివారికి రు 700/-లను బోనసుగా నిర్మాతలు యిచ్చారు.

నటీనటులకు, నిర్మాత శ్రీ మతి లక్ష్మీరాజ్యంగారికి అభినందన పత్రాలు సమర్పింప బడినవి.

నిర్మాతలు రాజ్యం పిక్చర్సు, డిస్ట్రిబ్యూటర్సు రాజశ్రీ పిక్చర్సు వారి తరఫున శ్రీ సుందిలాల్ నహతా గారు వందనములు సమర్పించారు.

తదనంతరం ఈ సినిమా తారలు 'బాలభారతి' సమావేశానికి హాజరయ్యారు. సంచాలకుడు శ్రీ ఏడిద కామేశ్వరరావుగారు వారిని పిల్లలకు పరిచయం చేశారు. శ్రీ యన్. టి. రామారావుగారు బాలభారతి సభ్యులకు సీటో పరిశీలించేనా భావి భారత పౌరులైన పిల్లలు క్రమ శిక్షణను అలవర్చుకోవాలని చెప్పారు. (స్వ. వి.)



అరుణావారి "గుమాస్తా"లో పండరీబాయి, మనోహర్, జయమ్మ.

మీరా ఆవేదన

శ్రీ చిత్తరంజన్ రాయ్ వేసిన తైలవర్ణ చిత్రం

## మద్రాసు స్కూల్ ఆఫ్ ఆర్ట్స్ విద్యార్థుల చిత్రకళా ప్రదర్శనం

మద్రాసు స్కూల్ ఆఫ్ ఆర్ట్స్లో పైరెండు తరగతుల విద్యార్థులు గీసిన చిత్రాలను ఆ స్కూల్ భవనంలోనే ఒక ప్రదర్శనంగా ఏర్పాటు చేశారు. ఈ 7-న మతాదాయ ధర్మాదాయాల శాఖమంత్రి కె. వెంకటస్వామి నాయుడుగారు ప్రారంభింప చేశారు.

అనస్కూలు విద్యార్థులు ఈ మాదిరి ప్రదర్శనం ఏర్పాటుచేయటం యిది రెండవసారి. వీరందరూ యింకా విద్యార్థిదశలో వున్నందువల్ల అనేక బాణీలలో అనేక శైలులలో ప్రయోగాలు చేసిచూడాలనేఒకరకమయినఆవేశంవీరికి సహజంగావుంటుంది. విద్యార్థిదశదాటి చిత్రకారుడుగా చెలామణి అవుతున్న వ్యక్తికి తానుఅభిమానించిన ఒకశైలి యేర్పడిపోవటమూ, క్రొత్తపుంతల జోలికిపోగల వుత్సాహంగానీ అవసరంకానీ అతనికి అంతగాలేకపోవటమూ పరిపాటిగా జరిగే విషయమే. చిత్రకళ ఒకవృత్తిగా స్వీకరించిన వ్యక్తులు పదిమంది వేసిన బొమ్మలను ప్రదర్శనంగా ఏర్పాటు చేసినప్పుడు, పదిరకాల బాణీలలో ప్రయోగాలు చేయాలనేవుత్సాహంతో ప్రతిఒక్కరూ వేసిన బొమ్మల నన్నిటినీ కలిపి ఒక ప్రదర్శనం యేర్పాటు చేసినప్పుడు ప్రేక్షకుడి అనుభూతిలో వ్యత్యాసం వుంటుంది. ప్రతిచిత్రకారుడూ, పదిరకాల ప్రయోగాలు చేసి వాటిలో తన వ్యక్తిత్వాన్ని వెదుకుకొంటూ వుంటే, ఆ ప్రయత్నాన్ని ఆ ఆవేదనను చూసే వారికి అదొక రకమైన ఆనందాన్ని యిస్తుంది.

ప్రస్తుత ప్రదర్శనంలో మనకు ముఖ్యంగా కనుపించేది ఈ లక్షణమే. సి. జె. ఎంథోనీదాస్, ఎ. పి. సంతానరాజ్, సూర్యప్రకాశ్ వామదేవ్ గార్ల చిత్రాలలో ఈలక్షణం మరీ కొట్టవచ్చినట్లు కనిపిస్తున్నది.

ఈసారి ప్రదర్శనంలో వున్న చిత్రాలలో చాలావాటికి మద్రాసు, దాని పరిసరాలు, దక్షిణదేశ దేవాలయాలు వీటిని అంటిపెట్టుకొని తిరిగే వ్యక్తులు, అక్కడ కనుపించే దృశ్యాలే మాతృకలుగా వుండటం కూడా ఒక విశేషం. అతిసుకుమారమైన రేఖలలో మామూలు మనుష్యుల ఊహలకు అందని కవితాభావాల జోలికి ఎవరూ అంతగా పోవటంలేదు. ఇంచుమించు ఈ చిత్రకారులందరూ మనకళ్లెదుట స్థూలంగా బలంగాకనిపించేమనుష్యులనీ, సంఘటనలనీ ధైర్యసాహసాలు వెల్లడిఅయ్యే విధంగా చిత్రించటానికే పాటుపడుతున్నారు. వీరిలో పొడసూపుతున్న యీ లక్షణం స్కూల్ ఆఫ్ ఆర్ట్స్ అధ్యాపకుల ప్రోత్సాహంతో పాదుకొన గలిగితే, పది పదిహేను ఏండ్లక్రితం వరకూ గగనవీధుల్లోనే విహరించిన కళాకాంత గట్టి నేలమీద కాలుమోపి నిలబడుతుందని ఆశించవచ్చు.

-వి. ఎన్.

నెల్లూరులో 1927 సం॥లో స్థాపింపబడిన అనాథ శిశుశరణాలయాన్ని అభివృద్ధికి తీసుకొనివచ్చి కుంప వెంగ్రాయసెట్టి ఎం. ఎల్. సి. గారు. ఈ శరణాలయానికి మొన్ననే రజతోత్సవం కూడా జరుపబడింది.

### "పెంపుడు కొడుకు"

ప్రసాద్ ఆర్ట్ పిక్చర్సువారు తెలుగు తమిళ భాషలలో తీస్తున్న చిత్రానికి తెలుగులో యింతవరకూ కన్న కొడుకు అనే పేరు వాడుతున్నారు. ఇప్పుడీ చిత్రానికి "పెంపుడు కొడుకు" అని పేరు పెట్టారు. సావిత్రి, శ్రీ రామమూర్తి, సి.ఎస్.ఆర్, రంగారావు, ప్రభృతులు వరలక్ష్మి, కుమారి మున్ని నుపావు నటిస్తున్న యీ చిత్రానికి ఎల్. వి. ప్రసాద్ దర్శకుడు; సాలూరి రాజేశ్వరరావు సంగీతదర్శకుడు. వాహిని స్టూడియోలో షూటింగ్ జరుగుతున్నది.

## రైళ్ల రాకపోకలు

| సెంట్రల్ | బయలుదేరే వేళ | వచ్చే వేళ |
|---|---|---|
| కలకత్తా మెయిలు | రా. 8-10 | ఉ. 6-50 |
| గ్రాండ్ ట్రంక్ ఎక్స్ప్రెస్ | ఉ. 8-5 | రా. 7-0 |
| మదరాసు విజయవాడ ప్యాసింజరు | ఉ. 6-25 | రా. 8-50 |
| పూరి ప్యాసింజరు | రా. 7-20 | ఉ. 9-10 |
| విశాఖ పార్సెల్ ప్యాసింజరు (3 వ తరగతి) | రా. 10-45 | ఉ. 6-0 |
| బొంబైమెయిలు | రా. 9-5 | ఉ. 5-50 |
| బొంబై ఎక్స్ప్రెస్ | ఉ. 7-35 | రా. 7-15 |
| రాయచూరు ప్యాసింజరు | ఉ. 8-45 | సా. 4-15 |
| రేణిగుంట ప్యాసింజరు | సా. 5-20 | ఉ. 9-32 |
| డిటో | | రా. 9-30 |
| ఆరక్కోణం ప్యాసింజరు | సా. 6-47 | |
| బెంగుళూరు మెయిలు | రా. 8-45 | ఉ. 6-25 |
| బెంగుళూరుఎక్స్ప్రెస్ | మ. 12-30 | మ. 2-15 |
| బెంగుళూరుప్యాసింజరు | ఉ. 6-10 | రా. 8-0 |
| బెంగుళూరుప్యాసింజరు | రా. 8-55 | ఉ. 5-30 |
| కోలార్ప్యాసింజరు | ఉ. 11-40 | మ. 2-35 |
| కొచ్చిన్ ఎక్స్ప్రెస్ | సా. 6-0 | ఉ. 7-55 |
| మంగుళూరుఎక్స్ప్రెస్ | రా. 7-30 | ఉ. 7-30 |
| నీలగిరిఎక్స్ప్రెస్ | రా. 8-5 | ఉ. 7-15 |
| జనతాఎక్స్ప్రెస్ (3వతరగతిమాత్రం) | | |

మదరాసు బొంబైలమధ్య సెంట్రల్ నుండి గురువారం మధ్యాహ్నం 2-20 బయలుదేరుతుంది. సోమవారం 3-25 రాక

ఢిల్లీ మదరాసు జనతా ఎక్స్ప్రెస్- (3 వ తరగతి మాత్రం) గురువారంలో మాత్రం మధ్యాహ్నం 11-30 గం॥లకు సెంట్రల్ వదులుతుంది. మంగళవారం సా. 5-40 గం. రాక.

| ఎగ్మూరు మెయిన్ లైను) | | |
|---|---|---|
| సెంకోటప్యాసింజరు | ఉ. 7-55 | రా. 8-40 |
| ఇండోసిలోన్ ఎక్స్ప్రెస్ | రా. 8-10 | ఉ. 7-25 |
| తిరువేంద్రం ప్యాసింజరు | రా. 9-50 | ఉ. 6-0 |
| మధుర ప్యాసింజరు | రా. 10-20 | ఉ. 5-30 |

| ఎగ్మూరు (కార్డులైను) | | |
|---|---|---|
| ధనుష్కోటి ప్యాసింజరు | ఉ. 11-10 | సా. 3-15 |
| త్రివేంద్రం ఎక్స్ప్రెస్ | రా. 7-30 | ఉ. 7-0 |
| మధుర జనతా ఎక్స్ప్రెస్ | సా. 6-55 | ఉ. 6-40 |
| తూత్తుకుడి ఎక్స్ప్రెస్ | రా. 9-30 | ఉ. 6-20 |
| విల్లుపురం ప్యాసింజరు | మ. 3-50 | ఉ. 11-40 |

మద్రాసు గవర్నర్ శ్రీ ప్రకాశగారికి నెల్లూరులో పురపాలక సంఘంవారు, జిల్లా బోర్డువారు సన్మానపత్రాలు సమర్పించారు. జిల్లాబోర్డు అధ్యక్షులు సన్మానపత్రం చదువుతున్న దృశ్యం.

మద్రాసు గవర్నర్ శ్రీ శ్రీప్రకాశగారికి, గూడూరులో, పురపాలకసంఘంవారూ, 'మద్రాసు మైకా అసోసియేషన్'వారూ, 'సౌత్ ఇండియా మైన్ ఓనర్సు అసోసియేషన్' వారూ సన్మాన పత్రాలు సమర్పించారు. పురపాలక సంఘ అధ్యక్షులు సన్మానపత్రం చదువుతున్న దృశ్యం.

వృద్ధ సౌందర్యం

శ్రీ పడవాయగం గీసిన నీటి రంగుల చిత్రం.

నెల్లూరు పురపాలక సంఘాధ్యక్షులు మద్రాసు గవర్నర్ శ్రీ శ్రీ ప్రకాశగారికి సన్మానపత్రం సమర్పించుచున్న దృశ్యం.

లోయలు - కొండలు

శ్రీ భరత్ పాటిల్ గీసిన నీటిరంగుల చిత్రం.

నెల్లూరుజిల్లా తిక్కవరంలో మద్రాసు గవర్నర్ శ్రీ శ్రీప్రకాశ 'మునిఅమ్మా హరిజన బాలికా వసతి గృహానికి' ప్రారంభోత్సవం చేశారు. ఆ సందర్భంలో అక్కడి నిర్వాహకులతో ప్రసంగించుచున్న దృశ్యం



Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty Street Madras.